భక్తి ప్రార్థనోపాసనాది

# పంచమహాయజ్ఞవిధి

---

## "వైదికధర్మ గ్రంథమండలి"

[ స్థాపితము బహుధాన్య ]

ఈ. ౧౯౩౮



సంపాదకులు :

పం. ధూ. రాజరత్నాచార్యులు.

పరిశోధకులు :

మంత్రిప్రగ్గడ వెంకటేశ్వరరావు.



ప్రేమసాగర్ ప్రెస్, గౌలీగూడ, హైదరాబాదు—ద.

ఏప్రియల్ ౧౯౪౦.

ప్రతులు ౨౦౦౦ వెల 3 అణాలు.



# వైదికధర్మ గ్రంధమండలి

## ఉద్దేశము.

వర్తమానకాలమందు ఆచారవిచారాది భేదములచే పరస్పర సంఘభావముచెడి జనులు సదాచార విముఖులగుట వలన, దేశమునకును, జాతికిని గొప్ప హాని కలుగుచుండుట సర్వజన విదితము.

సత్యాసత్యములఁ దెలిసికొనలేక, అంధవిశ్వాసమునకును, అహంకార దురాగ్రహాది హఠమునకును లోబడి, శారీరకోన్నతినిగాని బడయుటలేదు.

"ధర్మము, సత్యము, న్యాయము," అనునివి మనుష్యమాత్రులెల్లరకు సమానములై యుండ నిన్ని భేదములు కలిగియుండుటకుఁ గారణము, యథార్థమును గ్రహించకపోవుటయే యని నిశ్చయమగుచున్నది.

ఐన నిటనాంధ్రులందెన్నియో దురాచారములు ప్రబలి శారీరక, ఆత్మిక, సామాజికోన్నతికి గొప్పనష్టము కలిగించుచున్నందున, ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధిని గోరుచు నిట్టి లోపమును తొలగించు నుద్దేశముతో నీ గ్రంధమండలి స్థాపింపనైనది. కావున నాంధ్రసోదరీ సోదరులెల్లరు మా ఈ యుద్యమము పట్ల సానుభూతిఁ గలిగియుండఁ బ్రార్థితులు.

ప్రకాశకులు,

**మంత్రిప్రగ్గడ వెంకటేశ్వరరావు.**

## రాజపోషకులు,

మ. రా. శ్రీ గోద బాలకిషన్ ఆర్యగారు,

( బొల్లారం )

మ. రా. శ్రీ ఆర్. కే. వాసుదేవ ముదల్యారుగారు,

( సికింద్రాబాదు )

## పోషకులు,

మ. రా. శ్రీ రాజా వెంకటభూమారెడ్డిగారు,

( అరుమూరు )

మ. రా. శ్రీ యామజాల రాఘవరెడ్డిగారు,

( యామజాల )

## సహాయకులు,

మ. రా. శ్రీ ఆర్. కే. వాసుదేవ మొదల్యారుగారు,

( ఆర్యసమాజ ప్రధాని సికింద్రాబాదు )

మ. రా. శ్రీ కేతిరెడ్డి హనుమంతరెడ్డిగారు,

( చౌటపల్లి )

మ. రా. శ్రీ ఇబ్రాంపట్నం రాఘవాచార్యులుగారు,

( సుల్తాన్ బజారు )

మ. రా. శ్రీ సోముసోమేశ్వరరావు గుప్తగారు,

( సుల్తాన్ బజారు )

మ. రా. శ్రీ కే. బాబురావు యాదవగారు,

( ఇసామియాబజారు )

లకు నింతకంటె మించిన మంచి మార్గము మఱొకటి లేదనియు నిహపరముల కిదియే ఉపయుక్తమైన సాధనమనియు సూచించుచున్నాను. కాన శారీరిక, ఆత్మిక, సామాజిక లాభములఁబొందగోరు నాంధ్ర సోదరులు ప్రాతస్సాయంకాలములందీ కర్తవ్యములైన సంధ్యాది పంచమహాయజ్ఞములను ప్రతి దినము సలుఁపదగును. దీనినుండి ఆంధ్ర సజ్జనులు తప్పక లాభము బొందగలరని నమ్ముచున్నాను. ఆంధ్రులలో నొకరైన దీనినుండి లాభముబొందిన నా యీ యల్ప పరిశ్రమ సఫలమను కొందును.

విధి—ప్రాతఃకాల మంత్య యామమున లేచి నిర్జన ప్రదేశమునకుఁబోయి. ఆవశ్యక కృత్యముల నెరవేర్చుకొని కొంత దేహ పరిశ్రమ మను వ్యాయామము చేయవలెను, పిదప నదియందుగాని కూపమందుగాని స్వచ్ఛమైన జలముతోగాని స్నానము చేయవలెను. అనంతర మేకాంత స్థానమున గూర్చుండి మనస్సును స్థిరపఱచి గాయత్రీ మంత్రమును పఠించి, శిఖను గట్టుకొని ఇందు వ్రాయఁబడినట్లు సంధ్యావిధిని బూర్ణముగ సలుపఁదగును. ఈ సంధ్యోపాసనమును సూర్యోదయానంతర మగ్నిహోత్రమును అట్లే పితృయజ్ఞ బలివైశ్వదేవాతిథి యజ్ఞములను యథా క్రమముగ బరివార యుక్తముగ గృహములందుఁ జేయుట అత్యావశ్యకమని తెలుపఁగదగును.

వైదికధర్మ గ్రంథ మండలి యొక్క రాజపోషక గ్రాహకాదులేకాక నాంధ్రులెల్లరు దీనినుండి లాభము బొందవచ్చునని సూచించుచు విరమించుచున్నాను. ఇతిశమ్.

**సంపాదకులు.**



# ౧. బ్రహ్మయజ్ఞము (సంధ్యా)

ఓంకారార్థము:— అ, ఉ, మ్, సంయుక్తమైన 'ఓమ్, పరమేశ్వరుని యనేక గుణకర్మ స్వభావములను బోధించు సర్వోత్తమనామము. ఇందలి, 'అ, నుండి విరాట్ (వివిధ జగత్ప్రకాశకుడు) అగ్నిః (జ్ఞానస్వరూపుడు) విశ్వః (సర్వవ్యాపకుడు అను నిత్యాదులు, 'ఉ, నుండి—హిరణ్యగర్భః (సూర్యాది ప్రకాశక లోకముల నుత్పన్నము చేయువాడు) వాయుః (అనంతబల సంపన్నుఁడు) తైజసః (స్వప్రకాశస్వరూపుఁడు) అనునిత్యాదులు, 'మ్, నుండి ఈశ్వరః (సర్వైశ్వర్యయుక్తుఁడు) ఆదిత్యః (నాశరహితుఁడు) ప్రాజ్ఞః (సర్వజ్ఞుడు) అను నిత్యాదులుగ్రహింపబఁడును. ఇట్లీఓంకారార్థమును మంత్రములందంతటనెరుఁగఁదగును.

(మొదటఁ గ్రింద వ్రాయఁబడిన మంత్రమును పఠియించి మూఁడు ఆచమనములఁ జేయఁదగును. దీని ఫలము మనశ్శాంతి, స్థైర్యము, ప్రసన్నత కఫాదుల నివృత్తి ఇత్యాదులు.)

(౧) ఓంశన్నో దేవీరభిష్టయ ఆపో భవన్తు
పీతయే । శంయోరభిస్రవన్తునః.

యజుః అ. ౩౬. మం ౧౨.

శం = కల్యాణకారి

నః = మాకు

దేవీః = దివ్యగుణయుక్తుఁడు

అభిష్టయే — కోరికలీడేఱుటకు

ఆపః = సర్వవ్యాపకుఁడు
భవన్తు = అగుగాక
ప్రీతయే = పూర్ణానంద ప్రాప్తి కొఱకు
శంయోః = సుఖముయొక్క
అభిస్రవన్తు = వర్షము కురిపించుఁగాక.
నః = మాకొరకు

దివ్యగుణయుక్తుఁడును; సర్వవ్యాపకుఁడును నగు నా పరమాత్ముఁడు, కోరిన కోరిక లీడేఱుటకును, ఆనంద మలవడుటకునుగాను మాకుఁ గళ్యాణకారి యగుగాక; అట్లే మాపై సుఖవర్షమును గురిపించుఁగాక !

క్రింది మంత్రములతో ఇంద్రియములను స్పృశించఁదగును. దీని ఫలము—బలారోగ్యములు, ధర్మానుకూల ప్రవర్తనాది ప్రతిజ్ఞ.

(౨) ఓం వాక్ వాక్. ఓం ప్రాణః ప్రాణః. ఓం చక్షుః చక్షుః. ఓం శ్రోత్రం శ్రోత్రమ్. ఓం నాభిః, ఓం హృదయమ్. ఓం కంఠః. ఓం శిరః. ఓం బాహుభ్యాం యశోబలమ్. ఓం కరతల కరపృష్ఠే.

వాక్, వాక్ = వాక్కు, రుచి గ్రహణశక్తి
ప్రాణః ప్రాణః = శ్వాసము, గంధగ్రహణశక్తి
చక్షుః, చక్షుః = నేత్రము, రూపగ్రహణశక్తి
శ్రోత్రం శ్రోత్రమ్ = కర్ణము, శ్రవణశక్తి
నాభిః = బొడ్డు
హృదయం=హృదయము
కంఠః=కంఠము
శిరః=నెత్తి

బాహుభ్యామ్=భుజములతో
యశోబలమ్=కీర్తి, బలము
కరతల=అరచేయి
కరపృష్ఠే=చేతిపృష్ఠభాగమందు

పరమేశ్వరా! నా వాక్కును, రసగ్రహణశక్తిని; ప్రాణమును గంధగ్రహణశక్తిని; నేత్రములను రూపగ్రహణ శక్తిని; చెవులను శ్రవణశక్తిని; సమానవాయు యుక్తముగ నాభిని, ప్రాణవాయు యుక్తముగ హృదయమును, ఉదాన వాయు యుక్తముగఁ గంఠమును, మేధాయుక్తముగ శిరస్సును దృఢపఱచి రక్షించుము. నా భుజములందుఁ గీర్తిని బలమును నెలకొనజేయుము. చేతి పైభాగముతోను లోభాగముతోను నేను సదా ధర్మయుక్త కార్యములనే చేయుచుందునుగాక!

(క్రింది మంత్రములతో మార్జన మొనరించఁదగును. దీని ఫలము శుద్ధి ఆలస్యాదుల నివృత్తి.)

(3) ఓం భూః పునాతుశిరసి, ఓం భువః పునాతు నేత్రయోః, ఓం స్వః పునాతుకంఠే, ఓం మహః పునాతు హృదయే, ఓం జనః పునాతునాభ్యాం, ఓం తపః పునాతుపాదయోః, ఓం సత్యం పునాతు పునః శిరసి, ఓం ఖంబ్రహ్మ పునాతు సర్వత్ర.

భూః=ప్రాణాధారుఁడు
పునాతు=పవిత్రపరచుఁగాక
శిరసి=తలయందు
భువః=దుఃఖవినాశకుఁడు
నేత్రయోః=రెండు నేత్రములందు
స్వః=సుఖస్వరూపుడు
కంఠే=కంఠమునందు
మహః=గొప్పవాఁడు

హృదయే=హృదయమునందు
జనః=జగత్పితా
నాభ్యామ్=నాభియందు
తపః=జ్ఞానస్వరూపుఁడు
పాదయోః=పాదములందు
సత్యమ్=ఏకరసుఁడు
పునః=మరల
ఖమ్=వ్యాపకుఁడు
బహ్మ్రి=గొప్ప ఈశ్వరుఁడు
సర్వత్ర=అంతట

ఓ పరమేశ్వరా! నీవు నా శిరస్సును, నేత్రములను, కంఠమును, హృదయమును, నాభిని, పాదములను, శిరస్సు మున్నగువాని నన్నిటిని పవిత్రపఱచి వానికి బలమొసంగుము.

(క్రింద వ్రాయఁబడిన మంత్రముతో ప్రాణాయామము * చేయవలెను)

(౮) ఓంభూః ఓం భువః ఓం స్వః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యమ్.

ఈశ్వరుఁడు ప్రాణాధారుఁడును, పవిత్ర పఱచువాఁడును, ఆనందస్వరూపుఁడును, సర్వ శ్రేష్ఠుఁడును. సకలజగదుత్పాదకుఁడును, సర్వజ్ఞుఁడును, అఖండైకరసుఁడునై యున్నాఁడు.

---

* లోపలివాయువును, యథాశక్తి వెలుపడఁదీసి కొంతకాలమాపి చంద్రస్వరమను ఎడమనాసికా పుటముతో వాయువును పీల్చుకొనవలెను, "దీనిని పూరకమందురు." పిదప నుదరమందలి వాయువును యథాశక్తి లోపలనే యడ్డగించవలెను "దీనిని కుంభకమందురు" పునః మెల్లమెల్లగా సూర్యస్వరమను కుడి నాసికాపుటమునుండి వెలువడఁ దీయవలెను. "దీనిని రేచకమందురు" ఇదియొక ప్రాణాయామము. రెండవసారి సూర్యస్వరముతో పూరించి పిదపఁ జంద్రస్వరముతో రేచించవలెను ఈక్రమముగనే ప్రాణయామము చేయుచుఁబోవలెను. మూఁటికిదక్కువ జేయఁగూడదు. దీనివలన మానసిక దోషములు నశించి స్థైర్యము కలుగును.

(క్రింద వ్రాయఁబడిన మూఁడు 'అఘమర్షణ' మంత్రముల ద్వారా ఈశ్వరసృష్టిరచనా చింతనము జేయఁదగును.)

(౫) ఓం ఋతఞ్చ సత్యఞ్చాభీద్ధాత్తపసోఽధ్యజాయత ।
తతో రాత్ర్యజాయత తతః సముద్రో అర్ణవః ॥౧॥

ఋతం=వేదము
చ=మరియు
సత్యం=కార్యరూపప్రకృతి
చ=ఇంకను
అభీద్ధాత్=జ్ఞానజ్యోతినుండి
తపసః=అనంతసామర్థ్యమునుండి
అధ్యజాయత=ఉత్పన్నములయ్యెను
తతః=దానినుండియే
రాత్రిః=ప్రకృతియొక్క రెండవ వికృతి అను యవస్థ
అజాయత=ఉత్పన్నమయ్యెను
తతః=తదనంతరము
సముద్రః, అర్ణవః=సూక్ష్మ జలములు

ఈశ్వరునియొక్క అనంతజ్ఞానమయ సామర్థ్యము నుండి వేదములును, కార్యరూపప్రకృతియు నుత్పన్నములైనవి. అతని సామర్థ్యము నుండియే ప్రకృతియొక్క రెండవ అవస్థవికృతి యనఁబడునదియు, సూక్ష్మజలములును ఉత్పన్నములైనవి.

(౬) ఓం సముద్రాదర్ణవాదధి సంవత్సరో అజాయత
అహోరాత్రాణి విదధద్విశ్వస్య మిషతో వశీ ॥౨॥

సముద్రాత్ అర్ణవాత్=సూక్ష్మ జలములనుండి
అధి=వెనుక
సంవత్సరః=వర్షములను గలిగించు గతి
అజాయత=ఉత్పన్నమైనది

అహోరాత్రాణి=దినరాత్రములు
విదధత్=రచియించెను
విశ్వస్య=జగత్తుయొక్క
మిషతః=సహజస్వభావమునుండి
వశీ=వశమందుంచువాఁడు

జగత్తును వశమందుంచుకొను పరమేశ్వరుఁడు తన సహజస్వభావమునుండి ఆ సూక్ష్మజలములకుఁ బిమ్మటఁ గాల విభాగములను అనఁగా దినరాత్రములను గలుగఁజేయుగతిని ఉత్పన్నముఁ జేసెను.

(౭) ఓం సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్ । దివంచ పృథివీఞ్చాన్తరిక్షమథోస్వః ॥౩॥ ఋ. మండ. ౧౦. సూ. ౧౯౦ మం. ౧. ౨. ౩.

సూర్యాచంద్రమసౌ=సూర్య చంద్రులను
అకల్పయత్=రచియించెను
దివం=దివ్యలోకమును
ధాతా=రచియించువాఁడు
యథాపూర్వం=పూర్వకల్పమువలె
చ=మరియు
పృథివీమ్=భూమిని
అన్తరిక్షం=ఆకాశమును
అథః=పిమ్మట
స్వః=లోకలోకాంతరములను

విధాతయగు నీశ్వరుఁడు పూర్వకల్పమువలెనే సూర్యచంద్రులను, దివ్యలోకమును, భూలోకమును, అంతరిక్షలోకమును సమస్త లోకలోకాంతరములను రచియించియున్నాఁడు.

(పునః క్రిందవ్రాయఁబడిన మంత్రముఁ జదివి మూఁడు ఆచమనములఁ జేయఁదగును.)

ఓం శన్నో దేవీరభిష్టయ ఆపోభవన్తుపీతయే శంయోరభి స్రవన్తునః ॥

అనంతరముః—

(క్రింది ఆరు "మనసాపరిక్రమా" మంత్రములద్వారా సమస్తదిశలందు ఈశ్వరుని వ్యాపకత్వాదుల విచారము చేయదగును.)

(౧) ఓం ప్రాచీదిగగ్ని రధిపతిరసితో రక్షితాऽదిత్యా ఇషవః । తేభ్యోనమోऽధిపతిభ్యోనమో రక్షితృభ్యోనమ ఇషుభ్యోనమ ఏభ్యోఅస్తు । యోऽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥

ప్రాచీ=తూర్పు, ఎదుట
దిక్=దిక్కు
అగ్నిః=జ్ఞానస్వరూపుఁడు
అధిపతిః=రాజు
అసితః=బంధనరహితుఁడు
రక్షితా=రక్షించువాఁడు
ఆదిత్యాః=సూర్యకిరణములు
ఇషవః=బాణములు
తేభ్యః=వానికొరకు
నమః=నమస్కారము
అధిపతిభ్యః=అధిపతులకొరకు
నమః=నమస్కారము
రక్షితృభ్యః=రక్షకులకొరకు
నమః=నమస్కారము
ఇషుభ్యః=బాణములకొరకు
నమః=నమస్కారము
ఏభ్యః=వీనికొఱకు
అస్తు=అగుఁగాక
యః=ఎవఁడు
అస్మాన్=మమ్ములను

ద్వేష్టి=ద్వేషించుచున్నాడో
యమ్=ఎవనిని
వయం=మేము
ద్విష్మః=ద్వేషించుచున్నామో
తం=వానిని
వః=మీయొక్క
జంభే=న్యాయరూపసామర్థ్యమందు
దధ్మః = ఉంచుచున్నాము

సర్వజ్ఞుఁడవగు నోపరమేశ్వరా! నీవు మా యెదుటివై పున విద్యమానుఁడవై యున్నావు. నీవు స్వతంత్రరాజువును, రక్షకుఁడవునై యున్నావు. నీవు సూర్యుని రచియించి, ఆ సూర్యకిరణములద్వారా జగత్తునకు జీవనమును గలుగజేసి యున్నాఁడవు. నీయొక్క ఆధిపత్యమునకును, రక్షణమునకును జీవనరూప దానమునకునుగాను ఓ ప్రభువా! నీకుఁ బలుమార్లు నమస్కారములు. మాతో నెవనికి ద్వేషముకలదో, లేదా ఎవనితో మాకు ద్వేషముకలదో, అట్టి ద్వేషభావమును నీయొక్క న్యాయరూప సామర్థ్యమందుంచుచున్నారము.

(౯) ఓం దక్షిణాదిగింద్రో౽ధిపతిస్తిరశ్చిరాజీరక్షితా పితర ఇషవః। తేభ్యోనమో౽ధిపతిభ్యోనమో రక్షితృభ్యోనమ ఇషుభ్యోనమ ఏభ్యోఅస్తు। యో౽స్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మస్తం వోజంభే దధ్మః॥

దక్షిణాదిక్ = దక్షిణము కుడివైపు
ఇంద్రః = పరమైశ్వర్యయుక్తుడైన
అధిపతిః=రాజు [ఈశ్వరుఁడు
తిరశ్చి = తిర్యగ్జంతువులు
(వంకరగ నడచునవి)
రాజీ = సమూహము, పం :

రక్షితా = రక్షించువాడు
పితరః = పాలించువాఁడు
ఇషవః = బాణములు

(తక్కిన పదముల కర్థమును పూర్వమంత్రమునుండి యీ ౫ మంత్రములందప్లే గ్రహించఁదగును)

ఓ పరమేశ్వరా! నీవు మా దక్షిణదిక్కున వ్యాపకుఁడవైయున్నావు. నీవే మా రాజాధిరాజువు, నీవు వంకరగా నడచు జీవములనుండి మమ్ము రక్షించుచున్నావు. నీవు జ్ఞానవంతులద్వారా మాకు జ్ఞానమొసంగుచున్నావు. నీయొక్క ఆధిపత్యమునకు.........ఇత్యాది పూర్వమంత్రాన్వయము వలెనే యీ ౫ మంత్రములందు జెప్పుకొనదగును.

(౨౦) ఓం ప్రతీచీదిగ్వరుణోఽధిపతిః పృదాకూరక్షితాన్నమిషవః । తేభ్యోనమోఽధిపతిభ్యో నమో రక్షితృభ్యోనమ ఇషుభ్యోనమ ఏభ్యోఅస్తు । యోఽస్మాన్ ద్వేష్టి యంవయం ద్విష్మస్తంవో జంభే దధ్మః ॥

ప్రతీచీ = పశ్చిమము, వెనుక
దిక్ = దిక్కు
వరుణః = సర్వోత్తమస్వరూపుఁడు
అధిపతిః = రాజు
పృదాకూ = విషజీవములు
రక్షితా = రక్షించువాఁడు
అన్నం = భోజనపదార్థములు
ఇషవః = బాణములు

ఓ సౌందర్యనిధి! నీవు మాపృష్ఠభాగమున నున్నాడవు. నీవు మాయొక్క మహారాజువు. నీవు గొప్ప విషజీవముల

నుండి మమ్ము రక్షించుచున్నావు. నీవు మా ప్రాణములను అన్నములద్వారా కాపాడుచున్నావు. నీయొక్క ఆధిపత్యము నకు............

(౧౧) ఓం ఉదీచీ దిక్సోమోఽధిపతిః స్వజో రక్షితాఽశనిరిషవః । తేభ్యోనమోఽధిపతిభ్యోనమో రక్షితృభ్యోనమ ఇషుభ్యోనమ ఏభ్యోఅస్తు । యోఽస్మాన్ ద్వేష్టియంవయం ద్విష్మస్తంవో జంభే దధ్మః ॥

ఉదీచీదిక్ = ఉత్తరము, ఎడమ దిక్కు
స్వజః = స్వయముత్పన్నుఁడు
రక్షితా = రక్షించువాఁడు
సోమః = శాంతిస్వరూపుడు
అశనిః = విద్యుతము
అధిపతిః = రాజు
ఇషవః = బాణములు

ఓ తండ్రీ! నీవు మాయెడమదిక్కున వ్యాపకుఁడవై యున్నావు. నీవు మాయొక్క పరమపాలకుఁడవు. నీవు స్వయంభువుడవై మమ్ము రక్షించుచున్నావు. నీవే విద్యుత ముద్వారా మాయొక్క రక్తగతిని, కాపాడుచుఁ బ్రాణరక్షణముఁ జేయుచున్నావు. నీయొక్క ఆధిపత్యమునకు......

(౧౨) ఓం ధ్రువాదిగ్విష్ణురధిపతిః కల్మాషగ్రీవో రక్షితా వీరుధ ఇషవః తేభ్యోనమోఽధిపతిభ్యోనమో రక్షితృభ్యోనమ ఇషుభ్యోనమ ఏభ్యోఅస్తు యోఽస్మాన్ ద్వేష్టియంవయం ద్విష్మస్తం వో జంభే దధ్మః ॥

ధ్రువాదిక్ = క్రిందిదిక్కు
విష్ణుః = సర్వవ్యాపకుడు
అధిపతిః = రాజు పాలకుడు
కల్మాషగ్రీవః = పచ్చని బోదెలు
రక్షితా = రక్షించువాడు
వీరుధః = తీగెలు వనస్పతులు
ఇషవః = బాణములు

సర్వవ్యాపకుఁడనగు నో-పరమేశ్వరా! నీవు మా క్రింది దిక్కున వ్యాపకుఁడవై యున్నావు. నీవు మా పాలకుఁడవు నీవు పచ్చనిరంగుఁగల వృక్షముల మూలమునను, తీగెల మూలమునను మా ప్రాణములను గాపాడుచున్నావు. నీయొక్క ఆధిపత్యమునకు.. ......

(౧౩) ఓం ఊర్ధ్వాదిగ్బృహస్పతి రధిపతిశ్శ్విత్రోరక్షి తా వర్ష మిషవః। తేభ్యోనమోఽధిపతిభ్యోనమో రక్షితృభ్యోనమ ఇషుభ్యోనమ ఏభ్యోఅస్తు। యోఽస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మస్తం వో జంభే దధ్మః॥

ఊర్ధ్వాదిక్ = మీదివైపు
బృహస్పతిః = గొప్పస్వామి
అధిపతిః = రాజు
శ్విత్రిః = పవిత్రుఁడు
రక్షితా = రక్షించువాఁడు
వర్షమ్ = వాన

మహాప్రభో! నీవు మీది దిక్కున వ్యాపకుఁడవును పవిత్రాత్ముఁడవును, మా పాలకుఁడవును నై యున్నావు. నీవు వర్షములను గురిపించి మా పంటలకు నీరొసంగి మమ్ము బ్రతికించుచున్నావు. నీయొక్క ఆధితప్యమునకు.........

(క్రింద వ్రాయఁబడిన నాల్గు "ఉపస్థాన" మంత్రములద్వారా ఈశ్వరునకు సమీపస్థులై అతని తేజస్స్వరూపధ్యానము జేయఁదగును.)

(౧౮) ఓం ఉద్వయం తమసస్పరిస్వః పశ్యన్త ఉత్తరమ్।
దేవం దేవత్రాసూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్ ॥ య-౩౫-౧౪

ఉత్ = మంచి
వయమ్ = మేము
తమసః = అంధకారమునుండి
పరి = దూరము
స్వః = సుఖస్వరూపుఁడు
పశ్యన్తః = చూచువానిని
ఉత్తరమ్ = ప్రళయానంతర ముండువానిని
దేవః = ఈశ్వరుని
దేవత్రా = ఉత్తమగుణములతో
సూర్యమ్ = హితమొనర్చువానిని
అగన్మ = పొందుదుముగాక
జ్యోతిః = తేజస్స్వరూపము
ఉత్తమమ్ = శ్రేష్ఠము

హేప్రభో! నీవు అవిద్యాంధకారమునుండి వేరై యుండువాఁడవును, సుఖస్వరూపుఁడవును, ప్రళయానంతరముండు దివ్యగుణములతోడ నంతట విద్యమానుఁడవగు దేవుఁడవును. మమ్ము లను బుట్టించువాఁడవును నై యున్నావు. మేము నిన్ని ప్రకారముగఁ జూచుచు నీయొక్క దివ్యజ్యోతిని పొందుదుముగాక

(౧౫) ఓం ఉదుత్యంజాతవేదసం దేవం వహన్తి కేతవః
దృశే విశ్వాయ సూర్యమ్ ॥ యజుః అ ౩౩ మం. ౩౧.

ఉత్ = మంచిది, శ్రేష్ఠము
ఉ నిశ్చయము
త్యం = వానిని
జాతవేదసం = వేదముల నుత్పన్నము చేయువానిని
దేవం = దేవదేవుని

వహన్తి = మోపుచున్నవి
కేతవః = పతాకములు
దృశే = చూడఁగ
విశ్వాయ = అందఱికై
సూర్యం = ప్రకాశస్వరూపుని

ఓ జగదీశ్వరా! నీవు వేదముల నుత్పన్నముచేయువాఁడవును, ప్రకాశస్వరూపుఁడవునై యున్నావు. నీయొక్క మహిమను అందఱకి వెల్లడిచేయుటకు జగత్పదార్థములు పతాకములుగానున్నవి. (అనగా నెట్లు పతాకములు మార్గముఁ జూపించునో యటులే అందరికి నీ స్వాభావిక పదార్థములు నిన్ను సూచింపజేయుచున్నవి)

(౧౬) ఓం చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆప్రాద్యావా పృథివీ అన్తరిక్షంగ్ సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చస్వాహా॥ యజుః అ. ౭. మం. ౪౨.

చిత్రం = అద్భుతము
దేవానాం = విద్వాంసులయొక్క
ఉదగాత్ = ఉన్నాఁడు
అనీకం = బలము
చక్షుః = నేత్రము
మిత్రస్య వరుణస్య అగ్నేః=మిత్ర, వరుణ, అగ్నినాయక విద్వాంసులయొక్క
ఆప్రా=ధరించుచున్నాఁడు
ద్యావా—సూర్యలోకము
పృథివీ = భూలోకము
అంతరిక్షం = ఆకాశలోకము
సూర్యః = పుట్టించువాఁడు
ఆత్మా = అంతర్యామి
జగతః = సజీవములయొక్క
తస్థుషః = స్థావరములయొక్క
చ = మరియు
స్వాహా = సత్యమైనది

ఈశ్వరా! నీవు విద్వాంసులయం దద్భుతరూపముగ వర్తమానుఁడవును, శ్రేష్ఠుఁడవును నైయున్నావు. మిత్రవరుణ,అగ్ని, మున్నగు విద్వాంసులకుఁ జక్షువైయున్నావు. ద్యులోకమును, భూలోకమును, అంతరిక్షలోకమును ధరించు వాఁడవును, చరాచరముల నుత్పన్నము చేయువాఁడవును. వాని కాధారభూతుఁడవునునైయున్నావు. కాన మేము నిన్ను పొందుదుముగాక.

(౧౭) ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ పశ్యేమ శరదఃశతంగ్ శృణుయామ శరదఃశతం ప్రబ్రవామ శరదః శతమదీనాః స్యామశరదః శతం భూయశ్చశరదః శతాత్ ॥

యజుః అ, ౩౬. మం, ౨౪,

తత్ = ఆ

చక్షుః = చూచునతఁడు

దేవహితం = విద్వాంసుల హితమునకై, లోకహితమునకై

పురస్తాత్ —పూర్వమునుండి

శుక్రం = పవిత్రమైన

ఉచ్చరత్ = వర్తమానుడు

పశ్యేమ = చూతుముగాక

శరదః = ఋతు కాలములు, [వర్షములు

శతం = నూరు

జీవేమ = జీవింతుముగాక

శరదఃశతం= నూరుసంవత్సరములు

శృణుయామ = విందుముగాక

శరదఃశతం = నూరు సంవత్సరములు

ప్రబ్రవామ = పలుకుదుముగాక

శరదఃశతం= నూరుసంవత్సరములు

అదీనాః = స్వతంత్రులము

స్యామ = అగుదుముగాక

శరదఃశతం= నూరుసంవత్సరములు

భూయః = మరల

చ = మరియు

శరదః = సంవత్సరములు

శతాత్ —నూటికంటె నెక్కువగా

ఓ సర్వదృష్టా, సమస్తమును చూచువాఁడా! నీవు
నాదికాలమునుండి విద్వాంసులయొక్కయు నీ విశ్వముయొక్క
హితమునకై పవిత్రరూపముతో వర్తమానుఁడవై యు
వు. ప్రభువా! మేము నిన్ను నూరు సంవత్సరములవరకు
తుముగాక. భవదాజ్ఞానుకూలముగ నూరేండ్లు జీవింతు
గాక, నీ యాదేశమును నూరేండ్లు వినుచుందుముగాక, నీ
మ వ్యాఖ్యానమును నూరేండ్లు చేయుచుందుముగాక, అట్లే
రేండ్లు జీవించుకాలమందుఁ బరాధీనులమై యుండకుందుము
క, యోగాభ్యాసము ద్వారా నూరేండ్లకంటె నెక్కువ
యువు కలిగినను ఇవ్విధముగనే చరింతుముగాక.

(క్రింది "గాయత్రీ" గురు మంత్రముతో ఈశ్వరునిఁ బ్రార్థించ
గుఁను.)

(౧౮) ఓం భూర్భువఃస్వః తత్సవితుర్వరేణ్యం భర్గోదే
స్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్.

జుః అ ౩ మం. ౩౫ అథ ౩౬ మం. ౩. ఋ. మం ౩ సూ,
౬౨ మం ౧౦. సామ ఉత్తర సంహితా-ప్ర ౬ నుం. ౧౦.

= ప్రాణాధారుఁడు
= దుఃఖవినాశకుఁడు
= సుఖస్వరూపుఁడు

తత్ = అటి
సవితః = ఉత్పాదకుఁడు
వరేణ్యం = ఉత్తమమైన

భర్గః = పావనస్వరూపుఁడు
దేవస్య = ఈశ్వరుని
ధీమహి = ధ్యానింతుము
ధియః = బుద్ధులను
యః = ఎవఁడు
నః = మాయొక్క
ప్రచోదయాత్ = ప్రేరేపించుఁ గాత

ప్రాణపవిత్రతను ఆనందము నొసంగు నో ప్రభువా! నీవు సర్వజ్ఞుఁడవును, సకల జగదుత్పాదకుఁడవును నైయున్నావు. మేము నీయొక్క పూజనీయతమమైనట్టియు. పాప వినాశకమైనట్టియు, విజ్ఞానస్వరూప తేజమును ధ్యానించుచున్నాము. ఆ తేజమే మా బుద్ధులను ప్రకాశింపఁజేయుచున్నది. ఓ తండ్రీ! మాబుద్ధి నీ నుండి కదాపి విముఖమై యుండకుండుగాక. నీవు మాబుద్ధులందు సదా ప్రకాశితుఁడవై యుండి, మా బుద్ధులను సత్కర్మలందుఁ బ్రేరేపించుచుందువుగాక.

(క్రింద వ్రాయఁబడిన "సమర్పణ" మంత్రముతో ఈశ్వరునకు నమస్కారము చేయఁదగును.)

(౧౯) ఓం నమః శంభవాయచ మయోభవాయ చ నమః శంకరాయచ మయస్కరాయచ నమః శివాయచ శివతరాయచ॥ యజు. అ. ౧౬ మం ౪౧.

నమః = నమస్కారము
శంభవాయ = కల్యాణసాగరునకు
చ = మఱియు
మయోభవాయ = సుఖధామునకు

చ, నమః = మరియు నమస్కారము
శంకరాయ-చ = కల్యాణకారికిని
మయస్కరాయ, చ = సుఖప్రదాతకును
నమః = నమస్కారము

శివాయ, చ = కల్యాణస్వరూపునకును
శివతరాయ, చ = అత్యంత కల్యాణస్వరూపునకును

•

కల్యాణసాగరుఁడవును, సుఖధాముఁడవును, కల్యాణకరుఁడవును, సుఖప్రదాతవును, కల్యాణ తథా అత్యంతకల్యాణ స్వరూపుఁడవును నగు నో జగదీశ్వరా! నీకు మేము పదేపదే నమస్కారము చేయుచున్నాము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

సంధ్యా సంపూర్ణము.

•



# ౨వ దేవయజ్ఞము (అగ్నిహోత్రము)

సంధ్యోపాసనానంతరము, అగ్నిహోత్రము చేయం దగును. అదెట్లన— ౧౬ అంగుళముల వెడల్పును, పొడువును లోతును దాని అడుగు నాల్గవభాగమనగా ౪ అంగుళముల వెడల్పును, పొడువును గల కుండమును లోహాది యొకానొక ధాతువుతోగాని మట్టితోగాని చేయించి యుంచుకొనవలెను. అథవా ఈ పరిమాణముతో భూమియందైన గుండమును చేయించుకొనవచ్చును. ఇంక స్రువయనంబడు ౧౬ అంగుళముల పొడుగుగల నొక గరిటెను, ఒకానొక ధాతువుతోగాని శ్రేష్ఠమైన కఱ్ఱతోగాని చేయించుకొనవలెను, కాని దీని అగ్రభాగము ఆచమనివలె అంగుష్ఠ యవరేఖా పరిమాణము గలదై యుండవలెను. ఒక ఆజ్యస్థాలిని, అనగా ఘృతపాత్రను వెండితోగాని బంగారుతోగాని కఱ్ఱతోగాని చేయించుకొనవలెను. అట్లే ఒక జలపాత్రను, ఒక పట్టుకారును, పలాశాది సమిధలను యుంచుకొనవలెను. ఘృతమును కాచి వడయగట్టుకొనందగును. ౧ తులము మొదలుకొని ౫ తులముల వరకు ఘృతము ప్రతిదిన హోమమున కుండితీరవలెను. అగ్నిహోత్రి మొనర్చు నపుడు శుద్ధమైన స్థానమందు గూర్చుండి, పై చెప్పఁబడిన సామగ్రి నంత వద్దనుంచుకొని, మొదట సమిధలను గుండమందు చేర్చి, క్రింది మంత్రములతో నాచమనము 3 సార్లు చేయవలెను.

## ఆచమనవిధి.

(౧) ఓమ్ అమృతోపస్తరణమసి - స్వాహా ॥ దీనితో నొకటి.

(ఓమ్ అమృత) అమరుఁడవగు నో పరమేశ్వరా! నీవు (ఉపస్తరణమ్) జగత్తునంత విస్తరిల్లఁజేయువాడవై (అసి) ఉన్నావు. (స్వాహా)ఇది సుభాషితము.

(౨) ఓమ్ అమృతాపిధానమసి - స్వాహా ॥ దీనితో రెండవది.

(ఓం అమృత) అమరుఁడవగు నో పరమాత్మా! నీవు (అపిధానమ్) జగత్తునంత ధరించువాడవై (అసి) ఉన్నావు. (స్వాహా) ఇది సువాక్కు.

(3) ఓమ్ సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతామ్ - స్వాహా ॥ దీనితో 3 ది.

(ఓం) ఓ పరమేశ్వరా! (సత్యమ్) సత్యమైన కర్మ (యశః) కీర్తి (శ్రీః) సంపద (శ్రీః)ఐశ్వర్యము (మయి) నా యందు (శ్రయతామ్) విరాజిల్లుచునుండుగాక (స్వాహా) ఇది సువాక్కు.

## అంగస్పర్శవిధి,

(ఈ 2 మంత్రములతో నంగములను స్పృశింపఁదగును)

(౧)ఓమ్ వాఙ్మఆస్యేऽస్తు ॥౧॥ దీనితో ముఖమును.

(ఓమ్) ఓ పరమేశ్వరా! (వాక్) వాక్కు (మే) నాయొక్క (ఆస్యే) ముఖమందు (అస్తు) ఉండుగాక.

(౨) ఓం నసోర్మే ప్రాణోऽస్తు ॥౨॥ దీనితో నాసికాపుటములను.

(ఓమ్) ఓ పరమేశ్వరా! (మే) నాయొక్క (నసోః) ౨ నాసికాపుటములందు (ప్రాణః) ఊపిరి గొనుశక్తి (అస్తు) ఉండుగాక.

(3) ఓమ్ అక్ష్ణోర్మే చక్షురస్తు ॥3॥ దీనితో రెండు నేత్రములను.

(ఓమ్) ఓ పరమేశ్వరా! (మే) నాయొక్క (అక్ష్ణోః) రెండు నేత్రములందు (చక్షుః) దృష్టి "చూడగలశక్తి" (అస్తు) ఉండుగాక.

(౪) ఓమ్ కర్ణయోర్మే శ్రోత్రమస్తు ॥౪॥ దీనితో రెండు చెవులను

(ఓమ్) ఓ పరమేశ్వరా! (మే) నాయొక్క (కర్ణయోః) ౨ చెవులందు (శ్రోత్రమ్) శ్రవణశక్తి (అస్తు) ఉండుగాక.

(౫) ఓమ్ బాహ్వోర్మే బలమస్తు ॥౫॥ దీనితో ౨ భుజములను

(ఓమ్) ఓ పరమేశ్వరా! (మే) నాయొక్క (బాహ్వోః) ౨ భుజములందు (బలమ్) బలము (అస్తు) ఉండుగాక.

(౬) ఓమ్ ఊర్వోర్మే ఓజోఽస్తు ॥౬॥ దీనితో ౨ తొడలను.

(ఓం) ఓ పరమేశ్వరా! (మే) నాయొక్క (ఊర్వోః) ౨ తొడలందు (ఓజః) సామర్థ్యము (అస్తు) ఉండుగాక.

(౭) ఓమ్ అరిష్టాని మేఙ్గాని తనూస్తన్వామే సహసన్తు ॥౭॥ దీనితో గుడిచేతినుండి అంగములపై జలము చిలుకరించుకొనవలెను.

(ఓం) ఓ పరమేశ్వరా! (మే) నాయొక్క (అంగాని) అంగములన్ని (అరిష్టాని) రోగరహితములుగాను (మే) నాయొక్క (తనూః) శరీరమంత (తన్వాసహా) విస్తారపూర్వకముగాను (సన్తు) ఉండుగాక.

పిమ్మట గ్రింది మంత్రములతో నీశ్వరస్తుతిప్రార్థనోపాసనముల సలుపఁదగును.





# ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన మంత్రములు

(౧) ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ । యద్భద్రం తన్న ఆసువ ॥౧॥ యజు. అ. 30. మం. 3,

అర్థము= (సవితః) సకల జగదుత్పాదకుఁడవును, సమగ్రైశ్వర్యయుక్తుఁడవును (దేవ) శుద్ధస్వరూపుఁడవును, సమస్త సుఖముల నొసగు దాతవునగు నో పరమేశ్వరా ! నీవు కృపఁజేసి (నః) మా యొక్క (విశ్వాని) సంపూర్ణ (దురితాని) దుర్గుణములను, దుర్వ్యసనములను అట్లె దుఃఖములను (పరాసువ) దూరపఱుచుము (యత్) ఏ (భద్రం) కల్యాణకరమైన గుణకర్మ స్వభావాది పదార్థము కలదో (తత్) దానినంత మాకు (ఆసువ) లభింపఁజేయుము.

(౨) హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ । సదాధార పృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషా విధేమ ॥౨॥ యజు. అ. ౧3. మం. ౪.

అర్థము= ఎవడు (హిరణ్యగర్భః) స్వప్రకాశస్వరూపుఁడో, ప్రకాశమొనరించు సూర్యచంద్రమాది పదార్థముల నుత్పన్నముచేసి ధరించియున్నాఁడో (భూతస్య) ఉత్పన్నమైయున్న సంపూర్ణజగత్తున కెవడు (జాతః) ప్రసిద్ధుఁడైన (పతిః) స్వామియు (ఏకః) ఒకడే చేతన స్వరూపుడునై (ఆసీత్) ఉండెనో, ఎవడు (అగ్రే) సమస్త జగదుత్పత్తికిఁ బూర్వము (సమవర్తత) వర్తమానుఁడై యుండెనో (సః) అతఁడే (ఇమాం) ఈ (పృథివీం) భూమిని (ఉత) మరియు (ద్యాం) సూర్యాదులను (దాధార) ధరించుచున్నాఁడు.

మేమా (కస్మై) సుఖ స్వరూపుఁడైన (దేవాయ) నిర్మలుఁడైన పరమాత్ముఁడను గ్రహించుటకుగాను (హవిషా) గ్రాహ్యమైన యోగాభ్యాసముచేతను అతిప్రేమచేతను (విధేమ) విశేషమైన భక్తినొనర్చుచుందుముగాక ॥౨॥

(౩) య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః । యస్యచ్ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ ॥౩॥ యజు. అ. ౨౫ మం౧౩

అర్థము = (యః ఎవడు (ఆత్మదా) ఆత్మజ్ఞానము నొసంగువాఁడో (బలదా) శారీరిక, ఆత్మిక, అట్లె సామాజిక బలము నిచ్చువాఁడో (యస్య) (ఎవని విశ్వే) సమస్త (దేవాః) విద్వాంసులు (ఉపాసతే) ఉపాసించుచున్నారో, మరియు (యస్య) ఎవని యొక్క (ప్రశిషం) ప్రత్యక్షముగ సత్యస్వరూపమైయున్న శాసనమును, న్యాయము ననగా శిక్షను గ్రహించుచున్నారో (యస్య) ఎవనియొక్క (ఛాయా) ఆశ్రయమే (అమృతమ్) మోక్ష సుఖదాయకమై యున్నదో (యస్య) ఎవని నంగీకరించకపోవుట అనగా భక్తిసలుపక పోవుటయే (మృత్యుః) మృత్యువు మొదలుఁగాగల దుఃఖములకు హేతువై యున్నదో మేమా (కస్మై) సుఖస్వరూపుఁడైనట్టి (దేవాయ)సకల విజ్ఞానముల నొసఁగు పరమాత్మని ప్రాప్తికొఱకు (హవిషా) ఆత్మాంతః కరణములచే (విధేమ) భక్తియను నతని యాజ్ఞాపాలనముసఁ దత్పరులమై యుందుముగాక ॥౩॥

(౪) యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ । య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ ॥౪॥ యజు. అ. ౨౩. మం. ౩

అర్థము - (యః)ఎవడు (ప్రాణతః) ప్రాణము కలిగియున్నట్టియు (నిమిషతః) అప్రాణిరూపమైనట్టియు (జగతః) జగత్తునకు (మహిత్వా) తన యనంత మహిమతో గూడిన (ఏక, ఇత్) ఒకే (రాజా) విరాజమానుఁడైన రాజు (బభూవ) కలడో (యః) ఎవడు (అస్య) ఈ (ద్విపదః) మనుష్యాదుల యొక్కయు (చతుష్పదః) గవాది ప్రాణుల యొక్కయు శరీరములను (ఈశే) రచియించుచున్నాడో మేమా (కస్మై) సుఖస్వరూపుడైన (దేవాయ) సకలైశ్వర్యముల నొసంగు పరమాత్ముని (హవిషా) సర్వోత్తమమైన సామగ్రితో (విధేమ) విశేషభక్తి సలుపుదుము గాక ॥౪॥

(౫) యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేననాకః । యో అన్తరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥౫॥ యజు. అ. ౩౨. మం. ౬.

అర్థము - (యేన) ఏ పరమాత్మునిచే (ఉగ్రా) తీక్ష్ణ స్వభావములు గల (ద్యౌః) సూర్యాదులును (పృథివీ) భూమియు (దృఢా) ధరింపఁబడి యున్నవో (యేన) ఏ ఈశ్వరునిచే (స్వః) సుఖము (స్తభితమ్) ధరింపఁబడి యున్నదో మరియు (యేన) ఏ ఈశ్వరునిచే (నాకః) దుఃఖ రహితమైన మోక్షము ధరింపబడి యున్నదో (యః) ఎవడు (అంతరిక్షే) ఆకాశమున (రజసః) సమస్తలోకలోకాంతరములను (విమానః) విశేష విమానయుక్తములైన అనగా నాకాశమున పక్షులెగురు చందముగా సకలలోకములను నిర్మించువాడో అట్లే వాని భ్రమింపఁజేయు వాడో, మేమా (కస్మై) సుఖదాయకుడైనట్టి (దేవాయ) అపేక్షింపదగిన పరబ్రహ్మప్రాప్తి కొఱకు (హవిషా) సర్వసామర్థ్యము చేత (విధేమ) విశేషముగ భక్తి సలుపుదుము గాక ॥౫॥

(౯) ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ। యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తువయం స్యామ పతయో రయీణామ్ ॥౯॥

ఋ మం. ౧౦. సూ. ౧౨౧. మం. ౧౦

అర్థము - (ప్రజాపతే) ప్రజలందఱకు స్వామి వగునో పరమాత్మా (త్వత్) నీకంటె (అన్యః) భిన్నుఁడగు మరొకఁడు (తా) ఆ (ఏతాని) ఈ (విశ్వా) సకల (జాతాని) ఉత్పన్నములైన జడచేతనాదులను (పరి, బభూవ) తిరస్కారము చేయువాడు (న) లేడు, అనఁగా నీవు అందరికంటె గొప్పవాడవు (యత్కామాః) ఏయే పదార్థములను గోరు వారమగు మేము (తే) నీయొక్క (జుహుమః) ఆశ్రయము గోరుదుమో, మరియు నిచ్ఛగింతుమో (తత్) ఆయాకోరిక (నః) మాకు సిద్ధము (అస్తు) అగుగాక దానిఁజేసి (వయమ్) మేము (రయీణామ్) ధనైశ్వర్యములకు (పతయః) స్వాములను (స్యామ) అగుదుము గాక ॥౯॥

(౭) స నో బంధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా। యత్ర దేవా అమృతమానశానాస్తృతీయే ధామన్నధ్యైరయన్త ॥౭॥ యజు. అ. ౩౨. మ. ౧౦

అర్థము - ఓ మనుష్యులారా! (సః) ఆ పరమాత్ముఁడు (నః) మనకు (బంధుః) బంధువువలె సుఖదాయకుఁడును (జనితా) సకలజగదుత్పాదకుడును (సః) అతడే (విధాతా) సకల కార్యములను పూర్ణపఱచువాడున్నై (విశ్వా) సంపూర్ణమైన (భువనాని) లోకముల నన్నిటిని (ధామాని) నామస్థాన, జన్మములను (వేద) ఎఱుగుచున్నాడు, మరియు (యత్ర) ఏ (తృతీయే) సాం

సారిక సుఖదుఃఖములనుండి రహితుఁడై నిత్యానంద యుక్తుఁడైన (ధామన్) మోక్షస్వరూపధారియగు పరమాత్ముని యందు (అమృతమ్) మోక్షమును (ఆనశానాః) పొంది (దేవాః) విద్వాంసులు (అధ్యైరయన్త) స్వేచ్ఛాపూర్వకముగ విచరించు చున్నారో. ఆ పరమాత్మయే మనకు గురువు, ఆచార్యుడు రాజు అట్లే న్యాయాధీశుఁడై యున్నాఁడు కాన మనమందరము కలిసి సదా యతని భక్తి సలుపుదుము గాక ॥౭॥

(౮) అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ
వయునాని విద్వాన్ । యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాన్తే నమ ఉక్తిం విధేమ ॥౮॥ యజు. అ. ౪౦. మ౧౬.

అర్థము - (అగ్నే) స్వప్రకాశకుఁడవును, జ్ఞానస్వరూపుఁడవును, సమస్త జగత్తును ప్రకాశింపఁజేయువాఁడవును (దేవ) సమస్త సుఖముల నొసఁగువాఁడవునగు నో పరమేశ్వరా! మేము నీ నుండియే (విద్వాన్) పూర్ణముగ విద్యాయుక్తులమై యున్నాము, కృపఁజేసి (అస్మాన్) (మాకు) (రాయే) విజ్ఞానము కొఱకును అథవా రాజ్యాద్యైశ్వర్యముల ప్రాప్తి కొఱకును (సుపథా) మంచి ధర్మయుక్తులైన ఆప్తుల మార్గము ద్వారా (విశ్వాని) సంపూర్ణ (వయునాని) ప్రజ్ఞలను అట్లె ఉత్తమ కర్మలను (నయ) లభింపఁ జేయుము, అట్లే (అస్మత్) మా నుండి (జుహురాణమ్) కుటిలతాయుక్తమైన (ఏనః) పాపకర్మలను (యుయోధి) దూరము చేయుము. ఇందువలననే మేము (తే) నీ యొక్క (భూయిష్ఠామ్) అనేక విధస్తుతి రూపకమును (నమ,ఉక్తిం) నమ్రతా పూర్వకమునగు ప్రశంసను (విధేమ) సదా చేయుచుందుము గాక. అట్లె సర్వదా ఆనందమున నుందుము గాక ॥౮॥

## అగ్న్యాధానము.

(క్రింది మంత్రముతో కర్పూరమునో దూదివత్తినో వెలగించి హవన కుండము మధ్యఁబెట్టఁదగును)

ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవవ్వరిమ్ణా తస్యా స్తే పృథివి దేవయజని పృష్ఠేఽగ్ని మన్నాదమన్నాద్యాయాదధే॥

యజు. అ. 3. మం. 5॥

అర్థము - (ఓం) "స్వరక్షక" పరమేశ్వరుఁడు (భూః) సర్వాధారుడును (భువః) సర్వవ్యాపకుడును. దుఃఖవినాశకుడును (స్వః) సుఖస్వరూపుడునై యున్నాడు ఆ పరమేశ్వరుఁడు (భూమ్నా) సకలలోకములను ధరించుటచే (ద్యౌః ఇవ) ఆకాశమువలెను (వరిమ్ణా) తన విస్తారముచే (పృథివీ ఇవ) భూమి వలెను ఉన్నాడు (పృథివీ) ఓ భూమి (దేవయజని) ఏ నీవు దేవతులకు యజ్ఞస్థానమై యున్నావో (తస్యాః, తే) ఆ నీయొక్క (పృష్ఠే) వీపుమీద (అన్నాదం) హవ్యమును భక్షించు (అగ్నిం) భౌతికాగ్నిని (అన్నాద్యాయ) తినఁదగిన అన్నాదులు లభించుటకుగాను (ఆదధే) స్థాపించుచున్నాను.

(క్రింది మంత్రమును పఠించి విసనకఱ్ఱతో నగ్నిని ప్రజ్వలింపజేయ దగును)

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి త్వమిష్టాపూర్తే సంసృజేథామయంచ అస్మిన్ సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత ॥ యజు. ౧౫. ౫౪ ॥

అర్థము = (అగ్నే) ఓ విద్వాంసుడవైన యజమానుడా! నీవు (ఉత్) ఉత్తమరీత్యా (బుధ్యస్వ) చైతన్యము కలిగియుండుము, అట్లే (ప్రతి) ప్రత్యక్షముగ (జాగృహి) మేల్కొనియుండుము. (త్వమ్) నీవు, ఓ యజమానుడా! (చ) మరియు (అయమ్) ఈ యజ్ఞము, "మీరిరువురు" (ఇష్టాపూర్తే) ఇష్టమను వేదాధ్యయనము, ఆతిథ్యము మున్నగువాని పూర్తి కొఱకనగాఁ బ్రాహ్మబలము, బ్రహ్మచర్యము మున్నగునవను నీకర్మలతో (సంసృజేథాం) సంసర్గము కలుగఁజేయుడు (విశ్వేదేవాః) ఓ సమస్తవిద్వాంసులారా! (చ) మరియు (యజమానః) యజమానుడా! మీరందరు (అస్మిన్) ఈ (ఉత్తరస్మిన్) ఉత్తమమైన (సధస్థే) సమాజమందు (అధి) అధికారపూర్వకముగ (సీదత) కూర్చుండుడు.

## సమిధాధానము.

(క్రింది 3 మంత్రములతో 3 సమిధలను ఘృతమునముంచి కుండమున వేయదగును)

ఓమ్ । సమిధాగ్నిందువస్యత ఘృతైర్బోధయతాతిథిమ్ ఆస్మిన్ హవ్యా జుహోతన, స్వాహా । ఇదమగ్నయే ఇదన్నమమ ॥౧॥ య. 3. ౧॥ (దీనితో ౧ సమిధ)

అర్థము= (సమిధా) ఇంధనముచేతను (ఘృతైః) ఘృతముచేతను (అతిథిం) వ్యాపనశీలమైన (అగ్నిం) అగ్నిని (దువస్యత) మీరందరు పూజించుడు, అట్లే (బోధయత) ప్రకాశింపజేయుడు (అస్మిన్) దీనియందు (హవ్యా) హావనసామగ్రిని (ఆ) యథావిధి (జుహోతన) సమర్పింపుడు. (స్వాహా) ఇది మంచి ఆహుతి. (ఇదం) ఇది (అగ్నయే) పరమేశ్వరుని కొఱకుఁ గలదు. (ఇదం) ఈ దానము (మమ) నా కొఱకు (న) కాదు ॥౧॥

ఓమ్ । సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన । అగ్నయే జాతవేదసే స్వాహా । ఇదమగ్నయే జాతవేదసే ఇదన్నమమ ॥౨॥ యజు. 3. ౨॥ (రెండవ సమిధ)

అర్థము = (సుసమిద్ధాయ) బాగుగా ప్రదీప్తమై (శోచిషే) సంశోధించుటకుగాను (జాతవేదసే) పదార్థములందు విద్యమానమైయున్న (అగ్నయే) అగ్నికొఱకు (తీవ్రం) తపింపఁబడిన (ఘృతం) ఘృతమును (జుహోతన) మీరు సమర్పింపుడు, (స్వాహా) ఇయ్యది మంచి ఆహుతి. (ఇదం) ఈ "సమర్పణము" (జాతవేదసే) పదార్థములందు విద్యమానమైయున్న (అగ్నయే) పరమేశ్వరునికొఱకుఁ గలదు (ఇదం) ఇది (న,మమ) నాకొఱకుగాదు ॥౨॥

ఓమ్ । తం త్వా సమిద్భిరంగిరో ఘృతేన వర్ధయామసి బృహచ్ఛోచాయవిష్ఠ్య । స్వాహా । ఇదమగ్నయేఽఙ్గిరసే ఇదంన మమ ॥3॥ యజు. 3. 3. (మూడవ సమిధ)

అర్థము = (అంగిరః) ఓ వ్యాపనశీలా ! (తం త్వా) ఆ నిన్ను (సమిద్భిః) ఇంధనములచేతను (ఘృతేన) ఘృతముచేతను (వర్ధయామసి) మేము వర్ధిల్లఁజేయుచున్నాము, (యవిష్ఠ్య) ఓ అత్యంత సంయోజక వియోజకమా! నీవు (బృహత్) ఎక్కువగా (శోచా) ప్రజ్వరిల్లుము (స్వాహా) ఇది మంచి ఆహుతి (ఇదం) ఈ సమర్పణము (అంగిరసే) సర్వవ్యాపకుఁడైన (అగ్నయే) పరమేశ్వరునికొఱకుఁ గలదు (ఇదం) ఇయ్యది (న మమ) నాకొఱకుఁగాదు ॥3॥

## ఆజ్యాహుతి.

(క్రింది మంత్రముతో ౫ ఘృతాహుతు లివ్వదగును)

ఓమ్ అయంత ఇధ్మ ఆత్మా జాతవేదస్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్ ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చ సేనా న్నాద్యేన సమేధయ, స్వాహా। ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ ॥

అర్థము = (జాతవేదః) పదార్థములందన్నిట విద్యమానుడవగు నో పరమేశ్వరా! (అయమ్) ఈ నాయొక్క (ఆత్మా) ఆత్మ (తే) నీకొఱకు (ఇధ్మః) ఇంధనముగానున్నది (తేన) దానిం జేసి నాయందు (ఇధ్యస్వ) నీవు ప్రకాశితుండవుగా నుండుము (చ) మరియు (ఇత్, హ) అవశ్యమే (వర్ధస్వ) వర్ధిల్లుము (చ) అట్లే (అస్మాన్) మమ్ముం (వర్ధయ) నీవు వర్ధిల్లం జేయుము, ఇంకను (ప్రజయా) పుత్రపౌత్రసేవకాది ప్రజలతో (పశుభిః) గవాది పశువులతో (బ్రహ్మవర్చసేన) వేదవిద్యయొక్క తేజస్సుతో (అన్నాద్యేన) భోగ్యములగు ధాన్యఘృతదుగ్ధాది అన్నములతో (సం ఏధయ) సమృద్ధపరచుము (స్వాహా) ఇది చక్కని ఆహుతి (ఇదమ్) ఈ సమర్పణము (జాతవేదసే) పదార్థములందు విద్యమానుడును (అగ్నయే) జ్ఞానస్వరూపుండు నగు పరమేశ్వరునికొఱకు గలదు (ఇదం) ఇయ్యది (న మమ) నాకొఱకు గాదు. అనంతరము.

## జలప్రోక్షణము.

(క్రింది మంత్రములతో గుండమునకు నలువైపుల జలము చిలుకరిం చదగును)

ఓమ్ అదితేऽనుమన్యస్వ ॥౧॥ దీనితోం బూర్వమునకు

(అదితే) అఖండేశ్వరా! నీవు (అనుమన్యస్వ) అనుమతినిమ్ము లేక ప్రసన్నింపుము.

ఓమ్ అనుమ తేऽనుమన్యస్వ ॥౨॥ దీనితోఁ బశ్చిమమునకు

(అనుమతె) హితకరబుద్ధియుక్తపరమేశ్వరా! (అనుమన్యస్వ) నీవు ప్రసన్నింపుము.

ఓమ్ సరస్వత్యనుమన్యస్వ ॥3॥ దీనిచే నుత్తరమునకు

(సరస్వతి) సమస్త విద్యలకు నిధివగు నో పరమేశ్వరా! నీవు (అనుమన్యస్వ) ప్రసన్నింపుము.

ఓమ్ దేవసవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ । దివ్యో గంధర్వః కేతపూః కేతం నః పునాతు వాచస్పతిర్వాచం నః స్వదతు ॥४॥

య. ౧౧. ౭॥ 3౦-౧॥ దీనిచే నలువైపులందు

(దేవ) ప్రకాశమయుడవును (సవితః) సర్వసంచాలకుడవునగు నో పరమేశ్వరా! (యజ్ఞం) ఈ యజ్ఞమును లేక ఉత్తమ కర్మను (ప్రసువ) విస్తరిల్లఁజేయుము( అట్లే (యజ్ఞపతిం) యజ్ఞమును గాపాడు యజమానుని (భగాయ) ఐశ్వర్యసిద్ధికొఱకు (ప్రసువ) విస్తరిల్లఁజేయుము. (దివ్యః) అద్భుతస్వభావముగలవాడును (గంధర్వః) విద్యల కాధారుడను (కేతపూః) బుద్ధిచే శుద్ధపరచువాడునగు పరమేశ్వరుడు (నః) మా యొక్క (కేతం) బుద్ధిని (పునాతు) శుద్ధపఱచు గాక (వాచః) వాక్కునకు (పతిః) స్వామియైన పరమాత్మఁడు (నః) మాయొక్క (వాచం) వాక్కును (స్వదతు=స్వాదయతు) మధురము చేయుగాత.

## ఆఘారావాజ్యాహుతులు.

(క్రింది ౨ మంత్రములతో ఘృతాహుతు లివ్వఁదగును)

ఓమ్ అగ్నయే స్వాహా । ఇదమగ్నయే-ఇదం న మమ ॥౧॥
య. ౨౨, ౨౭॥ కుండమున నుత్తరభాగమందు.

(అగ్నయే) సర్వవ్యాపకుఁడైన పరమేశ్వరుని ప్రాప్తికొఱకు (స్వాహా) ఇది చక్కని ఆహుతి (ఇదం) ఈ సమర్పణము (అగ్నయే) పరమేశ్వరుని కొఱకుఁగలదు (ఇదం) ఇది (నమమ) నాకొఱకుఁగాదు.

ఓమ్ సోమాయ స్వాహా । ఇదం సోమాయ ఇదం న మమ॥౨॥
య. ౨౨. ౨౭. దక్షిణ భాగమందు.

(సోమాయ) సర్వజనకుఁడైన పరమేశ్వరునిఁ బొందుటకు (స్వాహా) మంచి ఆహుతి. (ఇదం) ఈసమర్పణము సోమాయ ఆ పరమేశ్వరుని కొఱకుఁగలదు (ఇదం) ఇది (నమమ) నాకొఱకుఁగాదు.

## ఆజ్యభాగాహుతులు.

(క్రింది మంత్రములతో గుండము మధ్య ౨ ఘృతాహుతు లివ్వఁదగును)

ఓమ్ ప్రజాపతయే స్వాహా । ఇదం ప్రజాపతయే ఇదం న మమ॥౧॥
య. ౨౨. ३౨.

(ప్రజాపతయే) ప్రజలఁ బాలించు పరమేశ్వరునికొఱకు (స్వాహా) మంచి ఆహుతి (ఇదం) ఇది (ప్రజాపతయే) పరమేశ్వరునికొఱకుఁగలదు (ఇదం) ఇది (న మమ) నాకొఱకుఁగాదు.

ఓమ్ ఇంద్రాయ స్వాహా । ఇదమింద్రాయ ఇదం న మమ॥౨॥
య. ౨౨. ౨౭.

(ఇంద్రాయ) పరమైశ్వర్యయుక్తుఁడైన పరమాత్మునికొఱకిది (స్వాహా) మంచి ఆహుతి. (ఇదం) ఇది (ఇంద్రాయ) పరమేశ్వరునికొఱకుఁ గలదు (ఇదం) ఇది (న మమ) నాకొఱకుఁగాదు.

## ప్రాతఃకాల హోమ మంత్రములు.

(ఇటనుండి ఘృతముతోను సాకల్యమను సామగ్రి మున్నగువాని తోను ఆహుతు లివ్వవలెను)

ఓం సూర్యోజ్యోతిర్జ్యోతిః సూర్యః స్వాహా ||౧|| య. ౩. ౯,

(సూర్యః) అంతర్యామియగు పరమేశ్వరుడు (జ్యోతిః) ప్రకాశస్వరూపుడు, ఎట్లు (జ్యోతిః) ప్రకాశమునకు మండలము (సూర్యః) ఈ సూర్యలోకమో, (స్వాహా) ఇదిమంచివాక్కు.

ఓం సూర్యోవర్చో జ్యోతిర్వర్చః స్వాహా ||౨|| య, ౩, ౯||

(సూర్యః) చరాచరములఁ బ్రకాశింపఁజేయు జగదీశ్వరుడు (వర్చః) కాంతిదాయకుఁడై యున్నాడు, ఎట్లు (జ్యోతిః) ఈ కాంతిదాయకమైన (వర్చః) అన్నముకలదో, (స్వాహా) ఇది చక్కని వాక్కు.

ఓం జ్యోతిః సూర్యః సూర్యోజ్యోతిః స్వాహా ||౩|| య, ౩, ౯||

(జ్యోతిః) అందరి నేత్రములందలి జ్యోతి (సూర్యః) ఆ సర్వవ్యాపకుఁడైన పరమేశ్వరుడే, ఎట్లు (సూర్యః) ఈ సూర్యలోకము(జ్యోతిః) మా నేత్రములకు జ్యోతియై యున్నదో, (స్వాహా) ఇది చక్కని ఆహుతి.

ఓం సజూర్దేవేన సవిత్రా సజూరుషసేంద్రవత్యా జుషాణః సూర్యో వేతు స్వాహా ||౪|| య. ౩. ౧౦||

(దేవేన) ప్రకాశమయుడును (సవిత్రా) సర్వప్రేరకుడునగు పరమేశ్వరునిచే (సజూః) ప్రీతియుక్తముగను (ఇంద్రవత్యా) సూర్యుని తెంబడించి యుండు (ఉషసా) ప్రభాతకాలయుక్తముగను (జుషాణః) సేవజేయుచున్న (సూర్యః) సూర్యలోకము (వేతు) మెరుయుచుండుగాక, (స్వాహా) ఇది చక్కని ఆహుతి.

## సాయంకాల హోమ మంత్రములు.

ఓం అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా ॥౧॥ య. 3. ౯

(అగ్నిః) పరమేశ్వరుడు (జ్యోతిః) ప్రకాశస్వరూపుడు, ఎట్లు (జ్యోతిః) ఈ ప్రకాశమానమైన (అగ్నిః) ఈ యగ్నికలదో, (స్వాహా) మంచివాక్కు.

ఓం అగ్నిర్వర్చో జ్యోతిర్వర్చః స్వాహా ॥౨॥ య. 3. ౯

(అగ్నిః) పరమేశ్వరుడు (వర్చః) కాంతిదాయకుడు, ఎట్లు (వర్చః) ఈ యన్నము (జ్యోతిః) కాంతిదాయకమైయున్నదో. స్వాహాశబ్దమున కర్థము పూర్వవత్తంతట నెరుగఁదగును.

ఓం అగ్నిర్జ్యోతి ర్జ్యోతిరగ్నిః స్వాహా ॥3॥ య. 3. ౯

(అగ్నిః) పరమేశ్వరుడు (జ్యోతి)జగన్నేత్రజ్యోతియై యున్నాడు. ఎట్లు (అగ్నిః) అగ్నియొక్క ప్రకాశము (జ్యోతిః) మా నేత్రములకు జ్యోతియైయున్నదో,

ఓం సజూర్దేవేన సవిత్రా సజూ రాత్ర్యేన్ద్రవత్యా జుషాణో అగ్నిర్వేతు స్వాహా ॥౪॥ య. 3. ౧౦॥

(దేవేన) ప్రకాశయుక్తుడైన (సవిత్రా) అంతర్యామి పరమేశ్వరునిచే (సజూః) ప్రీతియుక్తముగను (ఇంద్రవత్యా) సూర్యునితో నుండగల (రాత్ర్యా) రాత్రి (సజూః) యుక్తముగను (జుషాణః) సేవజేయుచున్న (అగ్నిః) అగ్నిప్రభావము (వేతు) వ్యాప్తమై యుండుగాక॥

## ప్రాతఃకాల సాయంకాల హోమ మంత్రములు.

ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా । ఇదమగ్నయే ప్రాణాయ ఇదం న మమ ॥౧॥

(ఓం) పరమేశ్వరుడు (భూః) సర్వాధారుడు (అగ్నయే) అగ్ని యొక్క ఉత్తమ ప్రభావముకొఱకును (ప్రాణాయ) లోనికిఁబోవు శ్వాసముయొక్క స్వస్థతకొఱకును (స్వాహా) ఇది మంచి ఆహుతి (ఇదం) ఈ కర్మ (అగ్నయే) అగ్నియొక్క ఉత్తమప్రభావము కొఱకును (ప్రాణాయ) ప్రాణముయొక్క స్వస్థతకొఱకును గలదు. (ఇదం న మమ) ఇది నా కొఱకుఁగాదు.

ఓం భువర్వాయవేఽపానాయ స్వాహా । ఇదం వాయవేఽపానాయ ఇదం న మమ ॥౨॥

(ఓమ్) పరమేశ్వరుఁడు (భువః) సర్వవ్యాపకుఁడు (వాయవే) వాయువుయొక్క ఉత్తమ ప్రభావము కొఱకును (అపానాయ) వెలుపలికి వచ్చు శ్వాసముయొక్క స్వస్థత కొఱకును (స్వాహా) ఇది మంచి ఆహుతి. (ఇదంవాయవే అపానాయ) ఈ కర్మవాయువు యొక్క ఉత్తమ ప్రభావము కొఱకును, అపానవాయువు యొక్క స్వస్థత కొఱకును గలదు ( ఇదం న మమ) ఇది నాకొఱకుఁగాదు.

ఓం స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా । ఇదమాదిత్యాయ వ్యానాయ ఇదం న మమ ॥౩॥

(ఓం) పరమేశ్వరుడు (స్వః) సుఖస్వరూపుడు (ఆదిత్యాయ) సూర్యునియొక్క మంచి తేజస్సుకొఱకును (వ్యానాయ) శరీరమందంతట సంచ

రించు వాయువుయొక్క స్వస్థతకొఱకును (స్వాహా) ఇది చక్కని ఆహుతి. (ఇదం ఆదిత్యాయ వ్యానాయ) ఇది సూర్యుని మంచి తేజస్సుకొఱకును, వ్యానముయొక్క స్వస్థతకొఱకును గలదు. (ఇదం న మమ) ఇది నా కొఱకుఁగాదు.

ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః ప్రాణాపాన వ్యానేభ్యః స్వాహా । ఇదమగ్నివాయ్వాదిత్యేభ్యః ప్రాణాపాన వ్యానేభ్యః ఇదం న మమ ॥౪॥

(ఓం భూః భువఃస్వః) పరమేశ్వరుఁడు సర్వాధారుడును, సర్వవ్యాపకుడును, సుఖస్వరూపుడునై యున్నాడు. (అగ్ని వాయు ఆదిత్యేభ్యః) అగ్నివాయుసూర్యులయొక్క మంచి ప్రభావముకొఱకును (ప్రాణ అపాన వ్యానేభ్యః) ప్రాణ, అపాన, వ్యానవాయువులయొక్క స్వస్థతకొఱకును (స్వాహా) ఇది మంచి ఆహుతి (ఇదం) ఇది అగ్ని వాయు (ఆదిత్యేభ్యః) అగ్నివాయుసూర్యులయొక్క మంచి ప్రభావముకొఱకును (ప్రాణ అపాన వ్యానేభ్యః) ప్రాణ అపాన వ్యానములయొక్క స్వస్థతకొఱకునుగలదు (ఇదం న మమ) ఇది నాకొఱకుఁగాదు.

ఓం ఆపో జ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భువః స్వరోం స్వాహా ॥౫॥

(ఓమ్) సర్వరక్షక పరమేశ్వరుడు (ఆపః) సర్వవ్యాపకుడును (జ్యోతిః) జ్యోతిస్వరూపుడును (రసః) రసవంతుడును, గ్రాహ్యుడును (అమృతమ్) అమరుడును (బ్రహ్మ) అందరికంటె గొప్పవాడును (భూః, భువః స్వః) సర్వాధారుడును, సర్వవ్యాపకుడును సుఖస్వరూపుడునై యున్నాడు.

ఓం । యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే ।
తయా మామద్య మేధయాఽగ్నే మేధావినం కురు స్వాహా ॥
॥౬॥ య. ౩౧. ౧౪.

(యామ్) ఏ (మేధామ్) ధారణావతి బుద్ధిని (దేవగణాః) దేవతులను విద్వాంసులును (చ) మరియు (పితరః) మాననీయ మహాత్ములైన పితరులును (ఉపాసతే) ఉపాసించు చున్నారో (తయా) అట్టి (మేధయా) బుద్ధితో గూడినవానిగా (అగ్నే) జ్ఞానస్వరూపుడవగు నో పరమేశ్వరా! నీవు (మాం) నన్ను (అద్య నేడు) (మేధావినం) బుద్ధిమంతుని (కురు) చేయుము.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ । యద్భద్రంతన్న ఆసువ స్వాహా ॥౭॥

ఓం అగ్నే నయ సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్ । యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాన్తే నమ ఉక్తిం విధేమ, స్వాహా ॥౮॥

(పై మంత్రముల కర్థము మొదటఁ బ్రార్థనా ప్రకరణమున వ్రాయఁబడినది, అటఁజూచు కొనఁదగును.)

ఓం భూర్భువః స్వః । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్. స్వాహా ॥౯॥

(దీనికర్థము సంధ్యాప్రకరణమున గలదు. చూచకొన దగును. ఎక్కువ ఆహుతు లివ్వగోరు వారు అన్య వేదమంత్రములతో నిష్టమైనన్ని పెంచి యివ్వవచ్చును. కాని పూర్ణాహుతికిఁ బూర్వమంతటం నీక్రింద వ్రాయఁబడు ఆత్మ సమర్పణమను స్విష్టకృతాహుతి యొకటి అవశ్యముగా నివ్వదగును)

ఓం । యదస్య కర్మణోऽత్యరీరిచం యద్వా న్యూన మిహాకరమ్ । అగ్నిష్టత్ స్విష్టకృద్ విద్యాత్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే । అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్ధయిత్రే సర్వాన్ నః కామాన్త్సమర్ధయ స్వాహా । ఇదమగ్నయే స్విష్టకృతే ఇదం న మమ ॥౧॥

అర్థము - (యత్) ఏమైన (అస్యకర్మణః) ఈ కర్మలో (అతి అరీచమ్) నేను ఎక్కువ జేసితినో (వా) లేక (న్యూనం) తక్కువ (ఇహ) ఇందులో (యత్) ఏమైన (అకరం) నేను చేసితినో (తత్) దానిని (సు ఇష్ట-కృత్) ఉత్తమాభీష్టముల సిద్ధింపజేయు (అగ్నిః) పరమేశ్వరుడు (విద్యాత్) ఎరుగుగాక, (స్విష్టకృతే) ఉత్తను కోరికలతో గూడినట్టియు (సుహుతహుతే) మంచి దానముతో గూడినట్టియు (అగ్నయే) పరోపకారముచేయు అగ్నికొఱకు బరమేశ్వరుడు (మే) నా యొక్క (తత్) ఆ (సర్వం, స్విష్టం) యజ్ఞరూప సుకార్యము నంత (సుహుతహుతం) విధి పూర్వకముగ సమర్పింప బడి నట్లంగీకారము (కరోతు) చేయుగాక (సర్వ ప్రాయశ్చిత్తా హుతీనాం) సకల పాపముల నశింపజేయు ఆహుతులనెడు (కామానాం) ఉత్తను కోరికల యొక్క (సమర్ధయిత్రే) అభివృద్ధి కొఱకు (నః) మాయొక్క (సర్వాన్) సమస్త (కామాన్) ఉత్తమాభీష్టములను "ఓ పరమేశ్వరా !" నీవు ) (సమర్ధయ) సిద్ధింపజేయుము (స్వాహా). ఇది చక్కని ఆహుతి (ఇదం) ఈ సమర్పణము (సు-ఇష్ట కృతే) ఉత్తమాభీష్టముల సిద్ధింపజేయు (అగ్నయే) పరమేశ్వరునికొఱకు గలదు (ఇదం న మమ) ఇది నాకొఱకు గాదు.

## పూర్ణాహుతి

(అంత మందీ క్రింది మంత్రముతో 3 సార్లు పూర్ణాహుతు లివ్వ
వలెను)

ఓం సర్వం వై పూర్ణంగ్ స్వాహా ॥

(ఓమ్) పరమేశ్వరుడు (సర్వమ్) అన్ని విధముల (వై) నిశ్చయముగ (పూర్ణమ్) పూర్ణుఁడై యున్నాడు. (స్వాహా) ఇది చక్కని ఆహుతి.

ఓం ద్యౌః శాన్తి రన్తరిక్షంగ్ శాన్తిః పృథివీ శాన్తి రాపః శాన్తి రోషధయః శాన్తి ర్వనస్పతయః శాన్తి ర్విశ్వే దేవాః శాన్తి ర్బ్రహ్మశాన్తిః సర్వంగ్ శాన్తిః శాన్తి రేవ శాన్తిః సామాశాన్తి రేధి ॥ ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

అర్థము - (ద్యౌః) సూర్యాదిలోకములు (శాంతిః) సుఖదాయకము లగుగాక (అన్తరిక్షమ్) "వాయు-మేఘ-నక్షత్రాది" మధ్యలోకములు (శాంతిః) సుఖదాయకము లగుగాక (పృథివీ) భూమి యున్నగు లోకములు (శాంతిః) సుఖదాయకము లగుగాక (ఆపః) జలము (శాంతిః) సుఖదాయకమగు గాక (ఓషధయః) అన్నాది ఓషధులన్ని (శాంతిః) సుఖదాయకము లగుగాక (వనస్పతయః) వనస్పతులను వృక్షములు, మూలికాదులన్ని (శాంతిః) సుఖదాయకము లగుగాక (విశ్వేదేవాః) సమస్త విద్వాంసులును, దివ్య పదార్థములన్నియు (శాంతిః) సుఖదాయకము లగుగాక (బ్రహ్మ) పరమేశ్వరుఁడు, వేదవిద్య, జితేంద్రియత్వము (సర్వం) ఇవన్నియు (శాంతిః) సుఖదాయకము లగుగాక (శాన్తిరేవ) ఆ శాంతికూడ (శాంతిః) సుఖదాయకమగు గాక (సా) ఆ శాంతిదేవి వగునీవు (మా) నాకు (ఏధి) లభించుము,

(ఇంక 3 సార్లు చేయంబడు శాంతి పాఠము యొక్క-భావము)

ఓ. పరమేశ్వరా ! నీవు దయంజేసి మాయొక్క త్రివిధ దుఃఖములను (అనగా ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధి దైవిక దుఃఖములను) దూరపఱు చుము. అట్లే మాకు సదా శారీరక, ఆత్మిక, సామాజిక సుఖములను గలుగ జేయుము. ఇత్యాగులు.

# 3వ పితృయజ్ఞము

అగ్నిహోత్రము చేసిన పిమ్మటం బితృయజ్ఞము చేయవలెను అదె ట్లన-జీవితులైన తల్లి, తండ్రి, ఆచార్యుడు, గురువు మున్నగువారి యొక్కయు మాన్యులైన విద్వాంసుల యొక్కయు సేవ అన్నాది పదార్థ ములతోం జేయుట శ్రాద్ధమనియు, ఆసేవచే వారు తృప్తినొందుట తర్పణ మనియు ననంబడును. కావనిట్లు చేయుటయే పితృయజ్ఞమని గ్రహింప వగును.

ఇతి పితృయజ్ఞః

# 4వ భూతయజ్ఞము (బలివైశ్వదేవము)

(పాకము సిద్ధమైన పిదప నా పాకాగ్నియందు గాని, హోమ కుండ మున గాని క్రింద వ్రాయంబడిన మంత్రములతో ఉప్పు, కారము, పులుసు నూనె ఇవి కలియని 10 అన్నాహుతు లివ్వవగును.)

ఓం అగ్నయే స్వాహా । ఓం సోమాయ స్వాహా । ఓం అగ్నిషోమాభ్యాం స్వాహా । ఓం విశ్వేభ్యో దేవేభ్యః

స్వాహా। ఓం ధన్వంతరయే స్వాహా। ఓం కుహ్వై స్వాహా। ఓం అనుమత్యై స్వాహా। ఓం ప్రజాపతయే స్వాహా। ఓం సహాద్యావాపృథివీభ్యాం స్వాహా। ఓం స్విష్టకృతే స్వాహా।

అర్థము - (ఓం అగ్నయే) జ్ఞాన స్వరూపుఁడైన పరమేశ్వరునికొఱకు (స్వాహా) ఇది మంచి ఆహుతి (సోమాయ) సకల పదార్థముల నుత్పన్నము చేసి రక్షించు పరమేశ్వరుని కొఱకు (అగ్నిషోమాభ్యాం) సకల ప్రాణులకు జీవనహేతువగు ప్రాణము కొఱకును. సర్వ దుఃఖ వినాశక హేతువగు అపానము కొఱకును (విశ్వేభ్యోదేవేభ్యః) జగత్తును ప్రకాశింపఁజేయు ఈశ్వరగుణముల కొఱకు లేక సమస్త విద్వాంసుల కొఱకు (ధన్వంతరయే) జన్మమరణాది రోగముల నశింపఁజేయు పరమేశ్వరుని కొఱకు (కుహ్వై) అమావాస్యేష్టి కొఱకు లేక పరమేశ్వరుని చితిశక్తి కొఱకు (అనుమత్యై) పూర్ణమాస్యేష్టి కొఱకు లేక ఈశ్వరుని మననము చితిశక్తి కొఱకు (ప్రజాపతయే) ప్రజల నందఱిని పాలించు పరమేశ్వరుని కొఱకు (సహాద్యావాపృథివీభ్యాం) విద్యా ప్రకాశమును పృథివిపై రాజ్యము నను నీరెంటికొఱకు - (స్విష్టకృతే) ఇష్ట సుఖముల లభింపజేయు పరమేశ్వరునికొఱకు మంచి ఆహుతి.

(దీనికిఁ బిమ్మట నీక్రింది బలిదాన మంత్రములతో ౧౬ అన్నభాగములను స్థాలియందు గాని, పత్త్రళియందు గాని గ్రాస ప్రమాణముగఁ బెట్టవలయును అప్పుడే అతిథి విచ్చేసిన నతని కాభాగముల దినఁబెట్టవలెను. లేనిచో వాని నగ్నియందు వేయఁదగును.)

ఓం సానుగాయేంద్రాయనమః. (తూర్పున)

ఓం సానుగాయ యమాయ నమః (దక్షిణమున)

ఓం సానుగాయ వరుణాయ నమః (పశ్చిమమున)

ఓం సానుగాయ సోమాయ నమః (ఉత్తరమున)

ఓం మరుద్భ్యో నమః (ద్వారమున)

ఓం అద్భ్యో నమః (జలస్థానమున)

ఓం వనస్పతిభ్యో నమః (రోలురోకలియుండుచోట)

ఓం శ్రియై నమః (ఈశాన్యమున)

ఓం భద్రకాల్యై నమః (నైఋత్యమున)

ఓం బ్రహ్మపతయే నమః }
ఓం వాస్తుపతయే నమః } (౨ మధ్యమున)

ఓం విశ్వేభ్యో దేవేభ్యో నమః }
ఓం దివాచరేభ్యో భూతేభ్యో నమః } 3 పైన
ఓం నక్తంచారిభ్యో భూతేభ్యోనమః }

ఓం సర్వాత్మభూతయే నమః (పృష్ఠభాగమున)

ఓం పితృభ్యః స్వధాయిభ్యః స్వధానమః (దక్షిణమున)

అర్థము — (సాను-) "ఇంద్ర" శబ్దముచే సకలైశ్వర్య యుక్తుఁడగు పరమేశ్వరుడు, "సానుగ" శబ్దముచే వతని దివ్యగుణములు, గ్రహింపబడును గాన వీని కొఱకు (నమః) సమర్పణరూపమైన అన్నభాగము. (సానుగా-) యథార్థముగ న్యాయముచేయు పరమేశ్వరుడు "యమ" శబ్దముచేతను, అట్లే అతని సృష్టియందు పక్షపాత రహితముగ న్యాయముచేయు సభాపతులు "సానుగ" శబ్దము చేతను గ్రహింపఁబడుదురు, వీరికొఱకు సమర్పణమను

అన్నభాగము (సా-వ-) సర్వోత్తముఁడైన పరమేశ్వరునికొఱకు అతని సద్భక్తుల కొఱకు సద్గుణరూప భాగము (సా-సో-) పుణ్యాత్ముల కొఱకు, వారి నానందింపజేయు పరమేశ్వరుని కొఱకు భాగము (మరుద్భ్యః) జగత్తున కంత జీవనాధారమైన ప్రాణముల కొఱకు భాగము. (అద్భ్యః) సర్వవ్యాపకుడైన పరమేశ్వరుడు, జీవనమునకు ముఖ్యమైన జలము అను వీని కొఱకు భాగము (వనస్ప.) జగత్తునకుపకారము చేయు వృక్షాదుల కొఱకు భాగము (శ్రియై) సేవింపఁదగినవాడును, రాజ్యాద్యైశ్వర్యములఁగలుగజేయు వాడు నగు పరమేశ్వరుని కొఱకు భాగము (భద్రకా-) కల్యాణకరమైన పరమేశ్వరునియొక్క అద్భుతశక్తి కొఱకు భాగము (బ్రహ్మ-) వేదములకు స్వామియగు పరమేశ్వరుని కొఱకు భాగము (వాస్తు-) గృహసంబంధమైన విద్యాది పదార్థముల బాలించు పరమేశ్వరుని కొఱకు భాగము (వి-దే-) జగత్తును ప్రకాశింపఁజేయు ఈశ్వరగుణముల కొఱకు లేక విద్వాంసు లందరి కొఱకు భాగము (దివాచ-) దినమందు సంచరించు ప్రాణులకొఱకు భాగము (నక్తంచా-) రాత్రియందు సంచరించు ప్రాణుల కొఱకు భాగము. (సర్వాత్మ-) సర్వాధార సర్వాంతర్యామియగు పరమాత్ముని కొఱకు భాగము. (పి-స్వః స్వ) తల్లి తండ్రి మున్నగు పితరుల కొఱకు, ఆచార్యాతిథులకొఱకు, భృత్యాది సేవకుల కొఱకు భాగము అనఁగా వీరి కందరికి ముందు భోజనము చేయించి పిదప గృహస్థుడు భోజనము చేయవలెను. కాని క్రింది మంత్రములతో ఉప్పు కారము మున్నగునవి కలిపిన ౬ అన్నభాగములు గ్రాస పరిమాణముగ నవశ్యముగ భూమిపైఁబెట్టి వాని వాని కివ్వఁదగును.

౧. శ్వభ్యో నమః (కుక్కలకు, అన్నము)

౨. పతితేభ్యో నమః (పతితులకు అన్నము)

3. శ్వపకేభ్యో నమః (చండాలులకు అన్నము)

౪. పాపరోగిభ్యో నమః (గ్రుడ్డి,గూని మొండి కుంటివారలకొఱకన్నము)

౫. వాయసేభ్యో నమః (కాకులకొఱకు అన్నము)

౬. కృమిభ్యో నమః (చీమలు మున్నగువానికొఱకు అన్నము)

ఇటు వేదమనుస్మృతుల ననుసరించి బలివైశ్వదేవవిధి వ్రాయబడినది.

# ౫వ అతిథియజ్ఞము

(పూర్ణవిద్వాంసుడును పరోపకారియు సత్యోపదేశకుఁడునగు అతిథి అనగా సంన్యాసి గృహస్థుల ఇండ్లకు విచ్చేసి నప్పుడీ క్రింది విధమున నతని సత్కరింపఁదగును.)

తద్యస్యైవం విద్వాన్ వ్రాత్యోఽతిథిర్గృహానాగచ్ఛేత్ ॥౧॥ స్వయమేనమభ్యుపేత్య బ్రూయాద్ వ్రాత్య క్వాఽవాత్సీః వ్రాత్యోదకం వ్రాత్య తర్పయన్తు వ్రాత్య యథా తే ప్రియం తథాస్తు వ్రాత్య యథా తే వశస్తథాస్తు వ్రాత్య యథా తే నికామస్తథాస్త్వితి ॥౨॥ అథ-కాం-౧౫. అ. ౨, వ-౧౧. మం ౧-౨.

అర్థము — (స్వయం) సొంతగ (ఏనం) అతని (అభ్యుపేత్య) సమీపించి, గృహస్థుడు (వ్రాత్య) ఓ సంన్యాసీ! నీవు (క్వ) ఎక్కడ (అవాత్సీః) నిన్న నివాసము చేసితి వని నమస్కరించి ఆసనముపై గూర్చుండ బెట్టి అడుగవలెను. పిదప గృహస్థుడు (వ్రాత్య) ఓ సంన్యాసీ! ఈ (ఉద

కమ్) జలమును గ్రహింపుమని జలాదుల నివ్వవలెను (వ్రాత్య) ఓ సన్న్యాసీ (తర్పయన్తు) మేము నిష్కపటముతో నొసంగిన జలాది పదార్థములు నిన్ను తృప్తిఁబొందఁజేయుగాక (వ్రాత్య) ఓ సంన్యాసీ! (యథా) ఎట్లు (తే) నీకు (ప్రియమ్) ఇష్టమో (తథా) అట్లు (అస్తు) అగుగాక, అనగా మే మట్లు వర్తింతుము గాక (వ్రాత్య) ఓ సంన్యాసీ! (యథా) ఎట్లు (తే) నీ యొక్క (వశః) ఆజ్ఞకలదో (తథా) అట్లు (అస్తు) అగుగాక (వ్రాత్య) ఓ సంన్యాసీ! (యథా) ఎట్లు (తే నికామః) నీ కోరిక పూర్ణము కాగలదో (తథాస్తు) అట్లే మేమొనర్తుముగాక.

ఇట్లు అతిథి సత్కారము చేసి అతని నుండి సదుపదేశమును బొంది ఆనందముగ నుండఁదగును.

ఇతి పంచ మహాయజ్ఞవిధిః సమాప్తః



# భజనలు.

## ౧ ప్రార్థన (భజన)

హే సప్తభూ నవ ఖండ రవిశశి ఆది ఆది చరాచరమ్ ।
విశ్వాని దేవ సదైవ దేవం ఏకమేవ గుణాగరమ్ ॥
సర్వస్య జగదాధార జ్ఞానవహార వ్యాపక సర్వకమ్ ।
సవితర్విధాతా సర్వ అంత ప్రకాశకస్య ప్రకాశకమ్ ॥
ప్రభు ఆప మమ త్రయతాపశాప, విలాప జగకారణ-కరణ్ ।
దురితాని ఖాని పరాసువ అథవా వ్యథాకీ జై హారణ్ ॥
యది సత్య భద్రం ముక్తపద అంకిత సుమత చిత దీజియే ।
కల్యాణ పద అర్థాత్ తన్న కృపాల ఆసువ కీజియే ॥

## ౨ భజన

శరణ ప్రభూ కీ ఆవో రే యహీ సమయహై ప్యారే ।
ఆవో హరిగుణ గావో రే యహీ సమయహై ప్యారే ॥
ఉదయ హువా ఓం నామక భాను, ఆవో దర్శన పావో రే ॥౧॥
అమృత ఝురనా ఝురతా ఇససే, పీకె అమర హోజావో రే ॥౨॥
ఈర్ష్యా ద్వేష కపటకో త్యాగో, సత్యమె చిత్త లగావో రే ॥౩॥
హరికీ భక్తి వినానహీం ముక్తి, ధృఢ విశ్వాస జమావో రే ॥౪॥
కరలే నామ హరికా సుమిరన, అంతకో న పఛతావో రే ॥౫॥
ఛోటె బడే సబ మిలకె ఖుశీసే, గుణ ఈశ్వరకే గావో రే ॥౬॥

## ౩ భజన

జయజయ పితా పరమ ఆనంద దాతా
జగదాది కారణ ముక్తి ప్రదాతా ॥౧॥
అనంత్ ఔర్ అనాది విశేషణ్ హైం తేరే ।
సృష్టికా స్రష్టా తూ ధర్తా సంహర్తా ॥౨॥
సూక్ష్మంసే సూక్ష్మం తూ హై స్థూల ఇతనా ।
కి జసమే యహ బ్రహ్మాండ సారా సమాతా ॥౩॥
మై లాలిత్ వ పాలిత్ హుం పితృ స్నేహకా ।
యహ సంబంధ హై ప్రాకృత తుఝసే తాతా ॥౪॥
కరో శుద్ధ నిర్మల్ మెరే ఆత్మాకో ।
కరూం మైం వినయ నిత్య సాయం వ ప్రాతా ॥౫॥
మిటావో మేరే భయకో ఆవాగమనకే ।
ఫిరూం న జన్మపాత ఔర్ బిల్బిలాంతా ॥౬॥
వినా తేరె హై కౌన దీననకా బంధు ।
కి జిసకో మైం అపనీ అవస్థా సునాతా ॥౭॥
“అమీ”రస పిలావో కృపాకరకే ముఝకో ।
రహూం సర్వదా తేరీ కీర్తికో గాతా ॥౮॥

## ౪ భజన

ప్రభుగుణ గావో నారే ।
సబ పాపతాప కటజావే ॥ప్రభు॥

భూర్భువః స్వః అంతర్యామి తత్సవితుర్వ రేణ్యం స్వామీ
భర్గో దేవస్యధీ మహితుమ ధ్యావా నా రే ॥౧॥
స్వయం అభయభయ సంకట హర్తా, పాలన పోషణ రక్షణ కర్తా ।
బలబుద్ధి సుఖ సకల ఉసీసే పావా నా రే ॥౨॥
మనకామన వాణీకా వాణీ పరమగురు పూరణ విజ్ఞాని ।
జప అమృతకో అజర అమర హోజావా నా రే ॥౩॥
సర్వేశ్వరహో సర్వాధారా, సబకే భీతర సబసే న్యారా ।
ఏకాగ్రచిత్ హోకర రానక్ ధ్యావానా రే ॥౪॥

## ౫ భజన

హేదయామయ హమ సబోంకో, శుద్ధతాయీ దీజియే ।
దూరకరకే హర్ బురాయీ శోభలాయీ దీజియే ॥౧॥
ఐసి కృపా ఔర్ అనుగ్రహ, హంపెహో పరమాత్మన్ ।
హోఁసభాసద్ ఇస్ సభాకే, సబకె సబ్ ధర్మాత్మా ॥౨॥
హో ఉజాలా సబకె మనమే జ్ఞానకే ప్రకాశసే ।
ఔర్ అంధేరా దూర్ సారా, హో అవిద్యా నాశసే ॥౩॥
ఖోటె కిర్మోంసె బచేఁ ఔర్ తేరే గుణగావేఁ సభీ ।
ఛూటజావేఁ దుఃఖసారే సుఖసదా పావేఁ సభీ ॥౪॥
సారి విద్యావోంకో సీఖేఁ జ్ఞానసే భరపూరహోఁ ।
శుభ కర్మోంమే హోవే తత్పర, దుష్ట గుణ సబ దూరహోఁ ॥౫॥

యజ్ఞ హవనసే హో సుగంధిత్ అపనా భారత్ వర్ష దేశ్ ।
వాయు జల సుఖ దాయి హోవేఁ జాయెఁ మిట్ సారే క్లేశ్ ॥౬॥
వేద కే ప్రచారమే, హోవేఁ సభీ పురుషార్థీ ।
హోవె ఆపస్ మే ప్రీతి ఔర్ బనే పరమార్థీ ॥౭॥
లోభి ఔర్ కామీ క్రోధి కోయిభి హమమే నహో ।
సారె వ్యసనోంసే బచేఁ ఔర్ ఛోడ్ దేవేఁ మోహకో ॥౮॥

## ౬ భజన ( తెలుగు )

ఓం భూః ఓం భూః ఓం భూః ఓం భూః
అతడేసృష్టి స్థితిలయ కారణుడు,అతడేసర్వాంత ర్యామి నిరాకారుడు॥ఓం
అతడేసాధుసత్పురుషుల పోషకుడుఅతడే,సగుణనిర్గుణముల వెలయుచుండు
అతడే సచ్చిదానంద స్వరూపుఁడు ॥ఓం॥
అతడే సకలప్రపంచ ప్రకాశకుఁడు, అతడేభక్తుల హృదయనివాసుండు
అతడే దుర్మద దుర్జన శిక్షకుఁడు ॥ఓం॥
అతడే ధర్మప్రబోధక రక్షకుఁడు. అతడే సకల చరాచరాత్మకుడు
అతడే అఖిల అవాఙ్మానస గోచరుఁడు ॥ఓం॥
అతడే తల్లిదండ్రి దేవదేవుండు ఆతడే బంధువు సఖుడు సహాయకుడు
అతడే దాతలకెల్ల ప్రదాయకుడు ॥ఓం॥
మహర్షి శ్రీమద్దయానందుఁడు నిజమానవ జాత్యుద్ధారకుఁడు
మృత్యు పర్యంతమి దేశబ్దంబని చనియే,నీదుసంకల్పమీడేరుగాక ప్రభు॥

## ౭ రాష్ట్ర గీతము

వందే త్వాం భూ దేవీ మార్యమాతరమ్ ।
జయతు జయతు పదయుగళం - తేనిరంతరమ్ ॥

శుభ్ర శరశ్చంద్ర యుక్త చారు యామినీమ్ ।
వికసిత నవకుసుమ మృదుల దామశోభినీమ్ ॥

మందస్మిత యుక్తవదన మధుర భాషిణీమ్ ।
సుజలాం; సుఫలాం; సరలాం;
శివ వరదాం, చిరసుఖదాం,
ముకుళ రదాం ఆర్యమాతరమ్ ॥వం ॥౧॥

దశకత్రియ కోటిజన, కంఠనాదినీమ్ ।
అమిత భుజాం, ధృత సదసీం - తనయ తారిణీమ్ ।
హిమనగజాం, స్వాభిమాన బుద్ధి దాయినీమ్ ।
కమలాం; అమలాం; అతులాం;
రిపుహారిణీం, బలకరిణీం, ధృతనలినీం, ఆర్యమాతరం ॥వం॥ ౨॥

ధర్మస్త్వం మర్మత్వం త్వం యశోబలమ్ ।
శక్తిస్త్వం భక్తిస్త్వం కర్మ చాఖిలమ్ ।
ధరణీం, భరణీం, జననీం,
కవిప్రతిభాం, నతసునభాం.జగదంబాం, రాష్ట్రమాతరమ్॥వం౩॥

## ౮ ప్రార్థన భజన

కరుణ రాద మాపై, ఓం ప్రభు ॥క॥
కరుణానిధివని శరణు జొచ్చితిమి ।
వరము లొసంగి భక్తుల్మముం బ్రోవగ ॥క ॥౧॥
దురితము లెల్లను దూరపరచి నీ -
వరకరుణామృత వర్షము గురియగ ॥క ॥౨॥
పాపము లెన్నియో జేసి చేసి నీ -
ప్రాపుం జేరితిమి పాలించెదవని ॥క ॥౩॥
తాపత్రయములం బాపి వేగమే -
కాపాడగరాదే నీ బిడ్డల ॥క ॥౪॥
అజ్ఞానంబును బోనడంచి కడు -
సు జ్ఞానామృతమును మాకొసగగ ॥క ॥౫॥
దుష్టత్వమునిలం దొలంగ జేసి మా -
కష్టములెల్లను కడతీర్చంగను ॥క ॥౬॥

## ౯ ఆర్యధ్వజ గీతము

జయతి ఓం ధ్వజ వ్యోమ విహారి ।
విశ్వప్రేమ ప్రతిమా అతిప్యారీ ॥జయ॥

# "వైదికధర్మగ్రంథమండలి"

## గ్రంథములు దొరుకు స్థలములు.



### హైద్రాబాదు :

హిందూ బుక్ డిపో (ఆబిద్‌రోడు)

కేశవ పబ్లికేషన్ బుక్‌స్టాల్ (మొజంజాహిమార్కెటు)

భారతీయ వస్తుభాండారు (సుల్తాన్‌బజారు)

చందా నారాయణశెట్టిగారు (చార్‌కమాన్)

గుండా వెంకటప్పయ్యగారు (అఫ్జల్‌గంజు)

పి. శివ్వప్పగారు (బషీరుగంజు)

ఆంధ్రబుక్ డిపో (సుల్తాన్‌బజారు)

శారదా బుక్ డిపో (సుల్తాన్‌బజారు)

రామేశ్వర త్రిపాఠిగారు (చార్‌కమాన్)

ఆర్యసమాజము (కిషన్‌గంజు)

ఆర్యసమాజము (లాల్‌దరువాజ)

### సికింద్రాబాదు :

వెంకటరాం అండ్ కో (కింగ్సు వే)

ఆర్యసమాజము (సికిందాబాదు)

### బొల్లారము :

ఆర్యసమాజము (బొల్లారం)